శ్రీ

# భృంగరాజ మహిమము
# శ్రాద్ధ సంశయ విచ్ఛేది

మహాకవి దాసు శ్రీరాములు

ప్రకాశకులు;
మహాకవి దాసు శ్రీరాములు స్మారకసమితి
3-4-885/A. బర్కత్‌పురా, హైదరాబాద్-27



"మహాకవి"

దాసు శ్రీరామామాత్యులు.



'మహాకవి'

దాసు శ్రీరామ పండితులు.

# భృంగరాజమహిమము.

ఇది ఆదినాథ సిద్ధునిచే నవనాథసిద్ధునకు ఉపదేశింపబడెను

పండిత శ్రీ దాసు శ్రీరామమంత్రిగారిచే అనువదింపబడినది

భృంగరాజము-అనగా గుంటగలగరచెట్టు ఇది మానవుల రోగనివారణార్థమై యాదికాలమున శ్రీమహాదేవి యవతారమైన భ్రామరీదేవివలన సృష్టింపబడినట్లును, సర్వరోగములను నివారింపజేయుశక్తి దీనియందున్నదనియు పూర్వకాలమున ఆదినాధుడను సిద్ధుడు నవనాధుడనుసిద్ధునితో జెప్పి కొంత గ్రంధము నుపదేశించినట్లు సంస్కృతములో నొక చిన్న పుస్తక ముండెను. ఆ గ్రంధము ఎట్లెట్లో సత్తెనపల్లి తాలూకాకు సంచారవశముగా వచ్చిన గోసాయివలన నొక బ్రాహ్మణవృద్ధుడు గ్రహించెగాని అది వ్రాయుటలో గణములు మొదలగునవి మిక్కిలి తప్పులుగా నుండెను. కొన్నిచోటుల తెలుగున వ్రాయబడియుండెను. ఆ భాగమును గణ యతి ప్రాసాదులు మిక్కిలి తప్పులుగా నుండెను. కాని యందులోని యోషధులు వస్తువులు వీని పేళ్ళు మాత్రము తెలిసికొనదగియే యున్నవి. ఇట్లుండగా ఆ సత్తెనపల్లి తాలూకా ప్రాంతములలో రాజకీయ వ్యవహారమొకటి యవలంబించి యున్నప్పుడు నా నాల్గవకుమారుడు గోవిందరావు మామగారగు శ్రీగోవిందరాజు భావనారాయణ పంతులుగారు ఆ పుస్తకమును తామొక ప్రతివ్రాసుకుని తమ వ్రాతపెట్టెలో పడవైచి యుంచిరి.

ఇటీవల యనగా 1906 వ సంవత్సరం ఆగష్టు నెల 9, 10 తారీఖులను నేను గుంటూరు వెళ్ళి మా వియ్యంకుడుగారి యింటి వద్ద నుండగా వైద్యశాస్త్ర సంబంధ ప్రసంగము వచ్చినప్పుడు వారి దగ్గరనున్న శ్లోకములు పద్యములు నాకు కనుపరుచుటలో యీ చిన్న పుస్తకమును గూడ చూపిరి అంతట నేను పరమానందభరితుడనయి తక్కిన వన్నియు నే ననుదినము చూచుచున్నవేకాని, ఇది క్రొత్తది యుని తప్పి స్ఖాలిత్యములు లేకుండ జక్కగ వ్రాయవలయునని తలంచి 1906 ఆగష్టు 11 వ తారీఖుననే నా శక్తి కొలది పరిశుద్ధి గలుగ వ్రాసితిని. కాని దాని యుపయోగమును కనుంగొనుటకు నేను అప్పుడే అదివరకు వ్యాధిగ్రస్త శరీరుడనయియున్నను విశేషబాధ లేకుండుటవలన యీ పుస్తకమునకు ప్రతియొకటి వ్రాయవలసి యుండెను. కాని చిరంజీవు లగు నా మేనల్లుడు ఉప్పులూరి మల్లిఖార్జునరావు (గుడివాడలో ప్లీడరు) ఇతని తమ్ముడు నరసింహారావుల యొద్దనుంచి శాస్త్రవాదములకై విశాఖపట్టణములవరకు బోవలసినట్లు తంతివార్తలు వచ్చియున్నందున నేను అట్లే వెళ్ళియుంటిని. తరువాత అదేశములోనే నాకు దేహవ్యాధి ముదిరి నానావిధములగు దుర్గుణములు ప్రబలినందున 190 అక్టోబరు 10 వ తారీఖునకు ఏలూరు చేరినాను. వైద్యులు నానావిధములగు నౌషధసేవలు సేయించుచునే యున్నారు, ఆ నెల 29 వ తారీఖున హఠాత్తుగా జ్ఞాపకశక్తియు తగ్గినది. గ్రంథము చదువలేక పోతిని. నా వ్యాధి గుణములు ఏవి యనగా శ్వాస, దగ్గు, నీరసము, అన్నపుతిండి క్షీణించుట, విరేచనబంధము, గొంతువాసన, రొమ్ముమంట, మిక్కిలి బరువు, విశ్రాంతిలేకపోవుట, బ్రతుకనను నిశ్చయబుద్ధి. ప్రపంచ

మందు నిరాశ, ఒకప్పుడు దుఃఖము. బహిర్దేశమునకు బోయెడి ముందు, వెళ్ళివచ్చిన తరువాత కొంతసేపు చెప్పలేనంత ఆయాసము, పిసుగు, మొగము తెల్లబడుట, అంతట యెట్లాయెనేమి ఏ ఔషధములు పుచ్చుకొన్నను వినియోగములేదని యెంచుకొనియు పనియుండియు నా కొమరులు కొందరు నివసించియున్న బెజవాడకు 7-11-1906 తారీఖున ప్రవేశించి యున్నాను. నా కొమరులయొక్క ప్రోద్బలము చేతను, నాకు బుట్టిన కొన్ని యూహల చేతను నానావిధ వైద్యములు జరిగినవి కాని యెంతమాత్రము నిమ్మళింపకపోగా ఇకను దేహము నీరుపట్టెడి చిహ్నములు కూడ గాన్పించినవి. నేను వైద్యసేవ చేయువాడనుకాను గాన నా స్వకీయ వైద్యమునకు దేనికి ప్రయత్నించనేలేదు. ఇట్లుండగా నెవ్వరో యిద్దరు ముగ్గురు కామరాజుగడ్డ రామయ్యపంతులుగారిని చూచినారాయాని యడిగిరి. వారికి వైద్యము తెలియునాయని నేను అడుగగా తెలియునని చెప్పిరి. ఆ మరునాటి యుదయమున వారియింటికి నేనువెళ్ళి నాకు ఆ మునగారు తండ్రిగారి కాలము నుండియు పరిచితులేగనుక నా దేహస్థితి చెప్పి చూచితిని అంతట వారు మందు యెల్లుండినుండి యిచ్చెదమనియు రేపు మా యింటికి వచ్చెదమనియు చెప్పి వాగ్దానప్రకారము వచ్చి గుంటగలగరాకు తెప్పించి తమయింటికి పంపవలసినదని చెప్పిరి. ఇట్లు ఏడుదినములు 2 తులముల పసరులో తమరొక యౌషధముంచి ఇత్తుమనియు, గోధుమలుపొట్టుతోవిసరిచేసినఅప్పడాలు నమలితినుటయు, కావనసినన్ని ఆవుపాలు త్రాగుటయు పథ్యమని చెప్పిరి. అనుదినము అదే విధముగా కావించుచున్నాను. నీరుపట్టు చిహ్నలతో నాకు అదివరకున్న యన్నిబాధలును మొదటిదినముననే నివ

ర్తించినవి. కాని ఆయనగారు యింకను నాకు అన్నియు తిను టకు ఆజ్ఞ యివ్వలేదు.

ఇంతట నేను చేసిన గ్రంధ "భృంగరాజమహిమము" జ్ఞాపకమువచ్చి గుడివాడకు జాబువ్రాసి తెప్పించి తేట తెల్లముగా టీక వ్రాసి యచ్చు వేయించెదమని బుద్ధి పుట్టినది. యిదార్థమునకు గుంటగలగరాకు సిద్దౌషధము. అమృతతుల్యము. ఇప్పుడు పత్రికలలో అర్థాశచే ప్రకటించు మందులు నేను చూచినట్లు నిష్ఫలములు. గుంటగలగరాకు వైద్యముమాత్రము డబ్బుదిగి వైద్యము చేయరాదని సిద్ధుడు చెప్పినాడు.

శ్రీ కామరాజుగడ్డ రామయ్య పంతులుగారి యాజ్ఞ పుచ్చుకొని ఇదివరలో నేను రచియించియున్న భృంగరాజ మహిమమును గ్రంధమును మంచి తేటతెల్లమైన టీకతో వేరుగ వ్రాయబూనితిని.

## వైద్యము చేయువాని విధులు

1. రోగి యీ వైద్యమును కోరగానే దాని వస్తుసామగ్రిని వాడు తెచ్చుకొనుటతప్ప తపనమిత్తము యేదైనా నివ్వవలసినదని యడుగరాదు.

2. రోగి ఔషధసామగ్రిని తెచ్చుకొనలేక వైద్యునిం గోరినప్పుడు ఆ సామగ్రికి యథార్థముగా నెంత వెచ్చపడునో అంతియే పుచ్చుకొనవలయును.

3. భ్రామరీస్తవము, భృంగరాజస్తవము యీగ్రంథాది యందున్నవి వానిని చదువనిది మందు నూరరాదు.

4 రోగికి రోగనివృత్తియైన సంతోషముచే నేదైన నీవచ్చిన యెడల యింత స్వల్పము తెచ్చితివేమని యనరాదు. ఇచ్చిన వెంతైనను సరే. అది గాని ఒకవేళ ఔషధ ద్రవ్యములకై షుమా రుగా నిచ్చిన దానిలో నెప్పుడయినా స్వల్పముగా మిగిలియున్న యెడల నదిగాని చక్కగా జ్ఞాపకముంచుకొని లేక వ్రాసిపెట్టి ధర్మకార్యమున కుపయోగించవలసినదిగాని వైద్యుడు స్వోప యోగము చేసికొనరాదు.

5. ధనమార్జించు నిమిత్తము వైద్యము సేయు వైద్యు లతో వైద్యవిషయముపై యేమియు మాటలాడరాదు.

6. భృంగరాజౌషధములచేతనిమ్మళించని దేహరోగములు అరుదుగా నుండుననియు, అవి యథార్థముచేత రోగములే కావ నియు, బరమేశ్వరునిచే బంపబడిన సాక్షాన్మృత్యు దేవతలనియు గట్టి నమ్మకముతో నుండవలయును.

7. వైద్యుడు పరిశుద్ధదేహుడు, ఆస్తికుడు, మాంసాద్యా హార వర్జితుడు సత్కర్మ సహితుడుగా నుండవలయును.

8. వైద్యుడు సంగరహితుడుగానుండుట మొదటి పక్షము. దురాశారహితుడుగా నుండుట రెండవపక్షము. ఆశాపిశాచగ్రస్తుడు అధముడు.

9. వైద్యుడు 16 సంవత్సరములకు లోబడి యుండరాదు 75 సంవత్సరములకు పైవాడుగా నుండరాదు. వీరే వైద్యులు, తక్కినవారు కారని ఆదినాథ సిద్ధుని మతము.

## రోగుల విధులు

1. భ్రామరీస్తవము, భృంగరాజస్తవము చేసియైనను వినియైనను ఔషధము పుచ్చుకొనవలయును.

2. ఈ భృంగరాజౌషధమందు భక్తియు నమ్మకము నుండవలయును. లేనియెడల నీమందు పుచ్చుకొననే కూడదు.

3. ధనము పుచ్చుకొని మందివ్వని వైద్యులు మోసగాండ్రని గట్టిగా నమ్మక ముంచవలయును.

4. రోగము నివారణమయినప్పటికి యీ భృంగరాజ వైద్యునకు విధిగా నేమయిన నివ్వవలయునని యనుకొనరాదు.

5. మందుకు అయ్యేడు స్వల్పమగు వ్యయము తప్ప నాకిక నేమియులేదను నిర్విచార మనస్సుతో నుండవలయును.

6. వైద్యునియందు భక్తియు నమ్మకమునుగలిగియున్న యెడలమాత్రమే యీ వైద్యమునకు పూనవలెను.

7. సంసారరహితుడు వైద్యుడయిన యెడల మిక్కిలి మంచిది. సంసారియైనను సన్మార్గప్రవర్తియు పరులను బాధించని వాడును సద్వంశము గలవాడును మాంసాహారవర్జితుడును నగునట్టి వైద్యునిం గోరుట సమపక్షము. తదితరులు యీ వైద్యమునకు నుతరాంపనికిరారు.

8. వైద్యుడు చెప్పిన పథ్యము తప్పక చేయ వలయును.

9. వస్తుసామగ్రి తనంతట తాను సంపాదించు కొని పుటములు వేసికొని మందు వేసుకొని అనుభవించ గల నేర్పరి యట్లు చేయవచ్చును. (ఇది కష్టము.) ఈ వైద్యమందు తాత్పర్యము గలవారు యీ చిన్న పుస్తకమును సంపాదించుకొని యింటిలో జాగ్రత్తగా నుంచుకొన వలయును. లేదా చదువు వచ్చిన వారి యొద్దనుంచుకొని వినుచుండ వలయును.

ఇట్లని యాదినాథ సిద్ధునిమతము.

బెజవాడ
10-3-1907

దాసు శ్రీరాములు

# భృంగరాజ మహిమము

## (గుంటకలగరచెట్టు మహిమ)

### భ్రామరీదేవి స్తవము

శ్లో॥ ఆదిశక్తి స్వరూపాంచ । నిర్జరావనతత్పరామ్
ఆరోగ్యదాయినీంవందే । భ్రామరీంలోకపోషణీమ్॥

### భృంగరాజ స్తవము

శ్లో॥ భ్రామరీపద సంభూతం గంగాతటనివాసినం
భృంగిరాజం నమామ్యద్య । సర్వరోగనివారణం॥

### ఆదినాథ స్తవము

శ్లో॥ ఆదినాథం మహాసిద్ధం । చంపకారణ్యవాసినం
లోకసంచారిణం సాధుం । మహావైద్యవిశారదం॥

## నవనాథ స్తవము

శ్లో॥ భావయేనవనాథంచ నిత్యంవననివాసినం
లోకోపకారిణం వందే । సుమరోగాపనుత్తయే

క. శ్రీకరముగ నవనాథుడు
ప్రాకటగతి జెప్పినట్టి పరవైద్యమునే
నేకతమున దెనిగింతును
మాకేవల భృంగరాజ మహిమము వేడ్కన్ 1

శ్రీ మన్నవ నాథుండను మహా సిద్ధుడు సంస్కృతము జేసిన భృంగరాజ మహిమమను వైద్యగ్రంథమునకు నేను తెను జేసి పద్యములలో వ్రాసెదను.

ఆదినాథ సిద్ధుడు నవనాథ సిద్ధునితో నిట్లని వచించె.

ఆ. వె. భృంగరాజ శక్తిసంగతియేమందు
నంగతాపముల భయంబులడచు
లింగమూర్తి తలను బొంగారుచున్నట్టి
గంగ యందపుట్టె గాదె తల్లి

గుంటగలగర చెట్టుయొక్క ప్రభావము నేనేమని చెప్పుదు ఈ మొక్క ప్రథమమందు గంగానదియొడ్డున వెలసినది. సర్వరోగ తాపములను బోగొట్టును.

ఆ. వె. చెలగి భృంగరాజ సేవనంబున నెన్న
దరముగాని రోగ తతియడంగు
బురుషునకు దలంప బూర్ణబలంబిచ్చు
ననుచు జెప్పె సిద్ధుడాదరమున.॥

ఈ గుంటగలగర మొక్క యెంతటి కఠినమైన రోగముల నయినను మాన్పును. శరీరమునకు మంచి బలముపట్టును.

ఆ. వె. గుంటకల్గ రొడలి పుంటిని గింటిని
బంటుతనముగల్గి బాగొనర్చు
ఒడలివ్యాధులెల్ల సడలి బలముకల్గు
నంటురోగసముదయంబు విడుచు||

ఈ గుంటగలగర బలమునిచ్చును. మేహపుండ్లను, కురువులను మాన్పును. నేత్రరోగముల కుదుర్చును. అంటు వ్యాధుల నివారించును.

గుంటగలగర మొలకల గుణములెన్న
వశముగాకుండు నెంతటివారికయిన
సంతతానంద మొనరించు సర్వగతుల
నలరసేవించు వారికే తెలియవలయు||

ఈ గుంటగలగరమొక్కల గుణము లిట్టివని చెప్పుట కెవ్వరికిని సాధ్యముకాదు. ఏంతటి బాధలో నున్నవారయినను ఆనందముకలిగి జీవింతురు. ఆ వైద్య మనుభవించిన వారికే దాని గుణము తెలియగలదు.

సీ|| భృంగరాజముదెచ్చి పెఱచన నెండించి
చూర్ణంబుచేసి విశుద్ధిమీర
వస్త్రఖాళనముమ వరుసనే కావించి
యైదుభాగములుగా నమరబెట్టి

మిరియాలచూర్ణంబు మిళితంబుగా మూడు
భాగంబులందులో బరగనునిచి
సొంఠిపిప్పలిపొడుల్ సొంపారరెండేసి
పాళ్ళందులోన తప్పకయకల్పి
అక్కలకరపొడి యనువుగా రెండు పా
ళ్ళందులో నేర్పుతో బొందుపరచి

గీ॥ గాలిసొరకుండ నొకబుఱ్ఱగట్టిసేసి
కర్షమాత్రంబు తేనెతో గల్పికొనుచు
ననవరతమును నరుడు జీవనముజేయ
వ్యాధిరాదని సిద్ధుండు పలికె నిజము.

గుంటగలగరాకు బాగుగా నెండించి చూర్ణము చేసి వస్త్ర భాళితము చేసి దానిని అయిదు భాగములుగా బెట్టి మిరియాల పొడి కలిపిన మూడు భాగములను, శొంఠి, పిప్పిళ్ళు మిరియాలు కలిపిన రెండు భాగములను అక్కలకర్రపొడి రెండు భాగములను గలిపి యొక బుఱ్ఱలో (సీసాలో) బోసి గాలి తగలకుండగజేసి పరిశుద్ధ ప్రదేశమునందుంచి యనుదినము మూడువేళ్ళ చివరలకు వచ్చినంత తేనెతో గలిపి సేవించుచుండెనేని సాధారణముగా జన్మావధివరకు రోగము రాదని సిద్ధుడు చెప్పెను.

తే.గీ. వాతరోగంబులకు నిదివైరిసుమ్ము
ప్రాతబెల్లముతో గూర్చి వరగనూరి
రేగువండ్లంత మాత్రలు రోగికిడిన
శూలలన్నియు గడియలో దూలిపోవు

ప్రాతబెల్లము, గుంటగలగరాకు పసరులో భావనచేసి రేగు పండ్లంత మాత్రలుచేసి అనుదినము సేవించుచుండెనేని వాత శూలలు హరించును.

సీ॥ చక్కగా భృంగరాజము సమూలముదెచ్చి
సూర్యాగ్ని నెండించి సొంపుమీర
యాముద్వయము ఖల్వమందున మర్దించి
హితముగా వస్త్రఖాళితము జేసి
తొమ్మిదిభాగంబు లిమ్ముగాగావించి
చెలువుగా శొంఠి పిప్పలి మిరెముల
పొడి మూడుపాళ్ళను బొందించి కరకకా
యలపొప్పరలపొడి యదొకపాలు
నన్నింట గటకరోహిణి యొకపాలును
మిశ్రంబుగావించి మేల్మిదనర

తే.గీ. బుర్రలోమూసి చక్కగా బుచ్చుకొనెడి
తరినినవమాషములయెత్తు స్ఫురణముగను
సురససింధూర చూర్ణంబు సొన్పితేనె
తోడగర్షంబు సేవింప తొలగు మూడు
దోషముల్ క్షయరోగముల్ ధూర్త కుష్ఠ
ములు నడంచును సిద్ధుండు పలికె నిజము

గుంటగలగరాకు యెండను సమూలము నెండించి మెత్తగా రెండుజాములు పొడిచేసి వస్త్రఘాలితముజేసి ఆ పొడి తొమ్మిది

పాళ్ళను శొంఠి పిప్పళ్ళు మిరియాల చూర్ణము మూడుపాళ్ళను, కరకకాయల బెరడు చూర్ణము 1 పాలును, కటుక రోహిణపొడ యొకపాలును గలిపి సీసాలో గాలి తగులకుండా గట్టివేసి ఔషధ సేవ సేయునప్పుడు మూడువేళ్ళ చివరలకు వచ్చినంత తీసుకొని తొమ్మిది మినపగింజలయెత్తు రససింధూరము పొడి కలిపి తేనెతో చక్కగా మాత్రలుచేసి పుచ్చుకొనెనేని వాతపిత్త శ్లేష్మముల వలన కలిగిన క్షయరోగములు, కుష్ఠురోగములు మానునని ఆదినాధ సిద్ధుడు చెప్పెను. అనిన విని సంతసించి నవనాధు౦ డాదినాధు౦ కిట్లనియె.

తే.గీ. గుంటగలగర మొలకల బందుతనము
వింటి నీముఖమున నేడు వీనులలర
కొంటెలకు నెల్లబుట్టెడు నంటు రుజలు
దీనితో మానువిధమును దెలుపు మనఘ.

నీవలన గుంటగలగరాకు మహిమ కొంత వింటిని దీనితో అందురోగములెట్లు మానునో తెలియజేయగోరుచున్నాను, అనిన విని యాదినాధుండు జెప్పెద వినుమని యిట్లనియె.

క. మిరియపు గింజలు తొమ్మది
వరుసం జూర్ణముచేసి వదలక యందు౯
వరభృంగదళ నవకము౯
బెరిమె మెదిపి తినిన జిలిపి వెతలడగించున్.

మిరియపు గింజలు తొమ్మిదింటిని చూర్ణముచేసి గుంటగల గరాకులు తొమ్మిది ఆ చూర్ణముతో గట్టిగామెదపి తినుచుండెనేని సెగ మొదలగు అంటురోగములు మానును.

క. పిప్పళ్ళును మిరియంబులు
నొప్పుగ శొంఠియును మోడి యొగివసకరకల్
తప్పక సమములు పొడిగా
గుప్పిగలగర రసమునను గొనుడి రుజలకున్

పిప్పళ్ళు మిరియములు, శొంఠి, పిప్పలి మోడి, వస కరక కాయల పప్పర సమభాగములుగా నూరి గుంటగలగరాకు పస రుతో సేవించిన విషూచి. మొదలగు అంటురోగాలు మా ను ను. అనిన విని సవనాధుండు సన్నిపాతంబులకును జ్వరంబులకును మార్గంబడిగిన నతండు పరమానందమున నిట్లని చెప్ప దొడంగె.

చ. గుటగుట వేళ్ళ చెక్కయును గోరికమీరగదెచ్చి పిమ్మటన్
చటుల తరంపు కల్గరసంబున మర్దనజేసి
మాత్రలన్
దటవిటశేకయొక్కొకటి నాలుగుగుంజలయెత్తు
చొప్పునన్
తటుకున రోగికిచ్చినను తంచర సన్ని హరించు
వేగమే॥

గుటగుటచెక్కయనగా కొందరుకాడమునగ చెక్కయనియు గొందరు తెల్లగలిజేరుపప్పరయనియు చెప్పుచున్నారు. యధార్ధమయిన యర్ధము ఇదియని తిన్నగా తెలియులేదు. గుటగుట వేళ్ళ చెక్కను గుంటగలగరాకు రసముతో మర్దనచేసి నాలుగేసిగుంజల యెత్తు మాత్రలు చేసి పుచ్చుకొనినయెడల సన్నిపాతములు మానును.

(3)

తే. గీ. శొంఠి పిప్పలి మిరియాలు సొరిదిగటుక
రోహిణియు గంటుభారంగి రూఢి మునగ
చెక్కయును గరకవప్పరజేర్చి యుప్పి
చెక్కచూర్ణంతోబుజేర్చి చెలగి తములు
పాకురసమును గలగరయాకురసము
బోసి యామద్వయమ్ము సంపూర్ణముగను
మర్దనముజేసి బదరప్రమాణమాత్ర
లొనర గావించి రోగి తాదినినయేని
సన్నిపాతంబు లన్నియు సమసిపోవు.॥

శొంఠి పిప్పళ్ళు మిరియాలు కటుకరోహిణి గంటు బారంగి మునగచెక్క కరకకాయలపేళ్ళు, ఉప్పి చెక్కచూర్ణము సమ భాగములుగా జేసి ఒకజాము తములపాకుల రసమున, మరియొక జాము గుంటగలగరాకు రసమున మర్దనజేసి రేగువండ్లంత మాత్రలు చేసి సేవించిన సన్నిపాతంబులన్నియు మానును.

సీ॥ భృంగరాజపు చెట్టు పొంగుచు గొనివచ్చి
యాకులు నీనలు నలరుకాడ
లన్నియుగ్రమముగా నలరంగ గూర్చియు
ఛిద్రంబులేనట్టి చెలువమైన
కుండవాసెన మీద గొమరొప్పగానుంచి
వెలయంగ శొంఠి పిప్పలి మిరెముల
పొడిమందులోనుంచి మూతగట్టిగవైచి
యటిక క్రిందను మంటననువు పరచి
ఒకజామువండి బైలకుదీసి ఖల్వాన
నిడి భృంగరసమున నెనయనూరి

తే. గీ. యందుసిందూరమును గల్పియంతసేపు
మర్దనముచేసి గుంజాప్రమాణమయిన
మాత్రలను దిన జ్వరములు మానువేగ
ననుచు సిద్ధుడు వచియించె నద్భుతముగ.

గుంటగలగరచెట్టు సమూలముగఁదెచ్చి చిల్లులులేని కుండకు వాసెనగట్టి దానిమీదనుంచి శొంఠి పిప్పళ్ళు మిరియాల పొడి బాగుగాపైచి మూకుడుతో గట్టిగా మూసి మధ్యాగ్నిచే నొక జామువండి బయటకుదీసి గుంటగలగరాకురసముతో ఖల్వాన జాము నూరి గురిగింజలంత మాత్రలుచేసి పుచ్చుకొనిన యెడల జ్వరములు మానును.

అంత నవనాథుండు భృంగరాజం బండశూలాదుల కుపయోగించు విధంబుపదేశింపవే యని యడిగిన నతండు.

తే. గీ. కండచక్కెర మిరియాలు గలయనూరి
గుంటగల్గర పసరులో గూర్చి కల్పి
మూడుతులముల యెత్తును మొనసిత్రాగ
నండశూలలు మూనాళ్ళ కడగిపోవు

పంచదార మిరియాలు బాగా నూరి గుంటగలగరాకు పసరులో కలిపి మూడేసి తులాల చొప్పున పుచ్చుకొనవలయును. వృషణాది (అండవాతము) శూలలు మానును.

సీ. అండశూలలనెల్ల ఖండించు విధమును
తాల్మితో నుడివెద దనరవినుము

భృంగరాజంబున బెర్మిరసము దీసి
కటుకరోహిణినందు గలయ నూరి
తేనెను దానిలో దెల్లంబుగా నుంచి
తర్వాత నార్ద్రవస్త్రమున రాచి
అండదేశము చుట్టి కొండొక సేపుంచి
పండునిప్పులమీద బరగ గాచి

తే. గీ. మూడుదినముల నీరీతి మొనసిచేయ
వాపడంగును శమియించు వడిగ శూల
సుఖముగానుండు నండముల్ శుద్ధములగు
ననుచు సిద్ధుండు వచియించె నద్భుతముగ.

కటుకరోహిణి గుంటగలగరాకు రసముతో నూరి తేనెలో రంగరించి తడిబట్టకు పూసి అండముల మీద వైచి పండునిప్పుల మీద కొంతసేపు కాచుచుండవలెను. మూడు దినములీలాగున జేయగా వాపుతీసి నొప్పి శమించును.

క. వెలిగారము పొంగించియు
కలిలోనన్ భృంగరసము కల్పియు వేగన్
తెలుపగు ఫేనముతోడన్
సలువుగ ద్రావింప శూల నటనలడంచున్

పొంగించిన వెలిగారము గుంటగలగరాకు పసరుతో చేర్చిన కడుగు బాగుగా గిల్కరించి నురుగువచ్చునట్లు జేసి తాగించిన యెడల శూలలు మానును.

## మేహ వాయువుతో గూడిన శూలలకు

తే. గీ. అరతులము కటుకరోహిణి సరగనూరి
మిరియముల చూర్ణమును దానమెళగించి
నాల్గుతులముల పసరులో నల్పి కల్పి
రోగికిచ్చిన శూలలు డాగిపోవె

అరతులము కటుకరోహిణి అంతే మిరియాల చూర్ణముతో కలిపి నాల్గుతులముల గుంటగలగర పసరులో బాగుగా గలిపి పుచ్చుకొన్న యెడల శూలలు హరించును.

తే. గీ. భృంగరాజపు కొనలను సంగతముగ
తురగసంఖ్యను గొనితెచ్చి పరగజేర్చి
యేడు మిరియాలతో మూడునాడులు దిన
చురుకురోగంబులు దొలగి సుఖమునిచ్చు

గుంటగలగరాకులు ఏడుకొనలతోనున్నవి, మిరియాలు ఏడు కల్పి సేవించిన యెడల చురుకు సెగలు మానును.

తే. గీ. ఏడుదినములు సేవింపనెల్లగతుల
పొక్కులు సవాయి చచ్చును మిక్కిలిగను
గ్రచ్చు జేసెడి రోగముల్ గదలిపోవు
ననుచు సిద్ధుండు వచియించె నద్భుతముగ

పై పద్యములో చెప్పినమందును 7 రోజులు పుచ్చుకొనిన యెడల పొక్కుసవాయి, చచ్చు మొదలగు చెడు రోగములు మానును.

అనిన నవనాథుండు నేత్రరోగంబుల కుపాయంబడిగిన నాది నాథుండు

ఆ. వె. భృంగరాజ రసము పాలుపొందగా దీసి
తుమ్మియాకు రసము తోడుజేసి
పిప్పలందు నూరి తెప్పున బెట్టిన
అక్షిమాంసదోష మణగిపోదె.

పిప్పళ్ళను తుమ్మియాకు రసముతోను గుంటగలగరాకు రసముతోను చక్కగా కాటుకవలె జేసి కన్నులకు బెట్టిన దుర్మాంస దోషములడగిపోవును.

ఆ. వె. కలగరాకు రసము గారవంబునదీసి
గారపండుజిగట గలయ నూరి
కన్నులందు బెట్ట కంపదోషమడంగు
నెలకు పూలుదొలగు నెమ్మి హెచ్చు.

గారపండు జిగట తెచ్చి గుంటగలగరాకురసముతో బాగుగా నూరి కన్నులకు బెట్టిన యెడల కన్నులదురుట మిటమిటలాడుట మానును. ఒక నెలరోజులు బెట్టిన పూలు కూడా మానును.

సీ. భృంగరాజరసంబు సంగతం బొనరించి
మిరియపు గింజల మిశితపరచి
కటుకరోహిణితోడ ఖల్వంబులోనుంచి
యా మత్రయంబున నమరనూరి

తలమాదలకు దీని దట్టంబుగ బూయ
పరిశుద్ధముగ మాను పదిదినాల
మరియారసంబున మంచి తెల్లనిజిల్లె
డాకురసమును గల్పి యతిరయమున

తే. గీ. శ్రవణరంధ్రబులను నొక్కజాముబిడిచి
చూడనెంతటి సర్పంబు గాడగరచి
బాధపడుచున్న దొలగు నిర్భయతబొసగు
వృశ్చికవిషంబు దొలగించు పేరిపసరు

మిరియాలు కటుకరోహిణి ఖల్వములో బాగుగా గుంటగలగరాకు పసరుతోనూరి తలమాదలకు రాచినయెడల మానును. ఇది మూడుజాములుమర్ధన పదిదినాలు రాయవలెను.

మరియు గుంటగలగరరసముతో తెల్లజిల్లేడాకు రసములో జాము పిడిచిన పాముకాటు మానును. పేరిరసము తేలుకాటును మాన్పును.

తే. గీ. ఆరువిధముల మాదలు నణగిపోవు
తేలుపడిచచ్చు పురుగులు తెరలిపోవు
రోమములు లేనిచోటను రోమచయము
దట్టముగబట్టు కలగరాకెట్టి దొక్కొ

అనుపాన విశేషములు బాగుగా దెలిసి పరిశుద్ధాంతస్స్వాకల వైద్యుడు పనిచేసెనేని అరు విధములగు మాదలును కుదురును. తేలు చచ్చును. పురుగులు నశించును. రోమములూడిపోయిన స్థలములలో రోమములు మొలచును.

అంత నవనాధుండు విశేష విధులడిగిన నాదినాథుండిట్లని వచియించెను.

## జ్వరాదులకు అమృతసంజీవనీ రసము

కం. రసవిష గంధకములతో
నుసమంబులు హింగుళంబు సొన్పిక్రమముగా
వెసనుగటుక రోహిణితో
విసువక భృంగరసమర్ద విధిజ్వరహరమౌ॥

రసము, నాభిగంధకము ఇంగిలీకము కటుకరోహిణి సమ భాగములుగా పొళ్ళుచేసి గుంటగలగరాకు రసముతో మర్దించి సేవింపజేసిన సర్వజ్వరములు మానును.

ఆ. వె. భృంగరాజ రసముబోసి యందును బ్రాత
యినుప చిట్టెముక్కయింత గూర్చి
కరకతాడి యుసిరికల గూర్చియు సుగంధి
పాలవేళ్ళ రసము పరగబోసి
కల్పికాచి చక్కగలయుంగబూసిన
వేగనెరుపుమాను వెండ్రుకలకు॥

గుంటగలగలర రసములో ప్రాతయినుప చిట్టెమును కరక తాడియుసిరికలును సుగంధిపాల వేళ్ళరసమును బోసి కల్పి బాగుగా కాచి తలకు బాగా మర్దనచేసి వెండ్రుకలకు రాచిన యెడల అకాలపు నెరుపు తక్షణము మానును.

కం. కస్తురి గోరోజనమును
ముస్తలు త్రికటుకలు త్రిఫలములు భృంగరస
ప్రస్తుత మర్ధిత మాత్రల
విస్తరమడగున్ ప్రసూతి విషరోగములున్॥

కస్తూరి గోరోజనము తుంగముస్తలు శొంఠి పిప్పళ్ళు మిరియాలు కరకతాడి ఉశిరికలు, బాగుగా మర్ధించి మాత్రలు చేసి ప్రసూతి, విషరోగములకిచ్చినయెడల, నయిమానును.

ఆ. వె. భృంగరాజరసమునిడి పొన్నగంటియు
పాలు నాముదంబు పరగనెయ్యి
నుసిరికల రసంబు నొగి కలబందయు
నారికడపు పువ్వు మీరగల్పి
తిప్పతీగెరసము నొప్పగాచిన నూనె
తలకునంట నేత్రములకు చలువ॥

గుంటగలగరాకు రసము, పొన్నగంటిరసము పాలు ఆముదము నెయ్యి ఉశిరికాయరసము, కలబందరసము, కొబ్బరి పూవుకషాయము, తిప్పతీగెరసము, పోసి కాచి చమురుతీసి తలకు మర్ధన చేసిన యెడల నేత్రములకుమంచిది. దీనినే భృంగామలక తైలము అందురు.

తే. గీ. ముషిణివేళ్ళ పొట్టు ముగినల్ల యుప్పియు
కాన్గవేళ్ళ పొట్టు కలయనూరి
భృంగనింబరస సమేతంబులం జేయు
నల్లకుష్ఠువేగ నాశమందు

ముషిణివేళ్ళ పొట్టును, నల్లయుప్పి పొట్టును, గానుగ వేళ్ళ పొట్టును బాగా నూరి గుంటగలగరాకు రసములోను వేపచెక్క రసముతోను కలిపి సేవించిన యెడల నల్లకుష్ఠు మానును.

తే. గీ.నల్లకుష్ఠు చూర్ణమెల్లవరా యెత్తు
పూట కొక్కమారు పుచ్చుకొనుచు
పచ్చపెసలపప్పు నచ్చావు మజ్జిగ
పథ్యమని యెరింగి వాడవలయు

పైన చెప్పబడిన నల్లకుష్ఠు కేర్పడిన చూర్ణము పూటకొక్క వరహాయెత్తు చొప్పున పుచ్చుకొనవలసినది. పచ్చ పెసలపప్పును ఆవు మజ్జిగయును పథ్యములు. తక్కినవేమియు పనికిరావు.

తే, గీ.నల్లకుష్ఠు మాన నరుడెంచెనేనియు
వేపచెక్క గంధమేపు మీర
భృంగరాజ రసము సంగతంబుగజేసి
రాచుచుండవలయు రమ్యముగను

పైనచెప్పబడిన కుష్ఠురోగమున కేర్పడిన చూర్ణమును సేవించునప్పుడు వేపచెక్క గంధమును గుంటగలగర ఆకురసమును కలిపి దేహమునకు రాయుచుండవలెను.

క. ఇలనల్ల కుష్ఠుబోవగ
దలచిన మూనాళ్ళకవల దలయంటుకొనన్
వలయును నామిదమున నీ
వల నెరుగవలయు జుండువారక మనుజుల్

పైన చెప్పిన చూర్ణము సేవించునప్పుడు ఆమిదముతో మూడేసి దినముల కొకసారి తలయంటుకొనుచుండవలెను.

తే. గీ.భృంగరాజ రసము బెర్మి యంత్రంబున
వారుదీరసంబు వరలజేసి
నిలవయుంచిరేని యిలనెల్ల రుజలకు
వాడవచ్చు మిగుల వైద్యనిధులు

గుంటగలగరాకు రసమును బట్టీబెట్టి సారము దీసి నిలువ యుంచుకొనిన యెడల అన్నిరోగములకు వాడవచ్చును.

కం. తంగేడు వేపచెట్టును
భృంగమహారాజు కానగవేరును త్రికటుల్
శృంగార త్రిఫలములు
రంగగు తిప్పయును రోగరాజికి రిపుల్

తంగేడుచెట్టు వేపచెట్టు గుంటగలగర కానుగవేరు శొంఠి పిప్పళ్ళు మిరియాలు, కరకతాడి యుసిరికలు యివి రోగనాశకములందురు.

క. విసపుముసిణి జిల్లేడును
వెసనీశ్వర దుష్టపును భువింగలిజేరుం
బసచెంచలి సహదేవియు
విసములడచు భృంగరాజు - పృథుయుక్తిమెయిన్

విషముషిణి వేరు జిల్లేడు చిగుళ్ళు ఈశ్వరచెట్టు, దుష్టపు చిగుళ్ళు తెల్లగలిజేరు ఆకురసము చెంచలిచెట్టు సహదేవి చెట్టు యివి గుంటగలగరాకు రసముతో కలిసిన యెడల అన్ని విషములు హరించును.

కం. కడులేత కలగిరాకును
వడిబచ్చడిజేసి దినమువరుసగ గొనినన్
గడుబలమును కాంతియు గలి
గెడునని సిద్ధుండుపలికె కేవలదయతోన్

లేత గుంటగలగరాకు పచ్చడి చేయించి అనుదినము సేవించినయెడల దేహమునకు బలమిచ్చునని సిద్ధుడు చెప్పెను.

క. దొడ్డిన్ గలకరమేడియు
తెడ్డుపాలయును తెల్లదింటెన నాల్గున్
ఒడ్డారించిన తాచులు
గడ్డని నడువంగలేవు కడుభీతిమెయిన్

గుంటగలగరచెట్టు, మేడిచెట్టు, తెడ్లపాలచెట్టు, తెల్లదింటెనచెట్టు, యీ నాల్గును దొడ్లోపెంచినయెడల దొడ్డిలోనికి త్రాచు పాములు సాధారణముగా రానేరావు.

తే. గీ. కృతయుగంబున శ్రీదేవి యతిముదమున
భ్రామరీదేవియయ్యె నప్రాప్తులైన
దుష్టరాక్షసులనుజంప నిష్టలీల
నపుడు ఋషులెల్ల బ్రార్థింప నంరిదేవి

కృతయుగములో ఆదిశక్తి భ్రామరీ యను అవతార మెత్తెను. అపుడు దుర్మార్గులయిన రాక్షసులను జంపునట్టి శక్తి దేవతలకు కలుగునట్లు యీ భృంగరాజమను గుంటగలగరాకును ఆశక్తి సృజించెనని ఆదినాథ సిద్ధుడు నవనాథ సిద్ధునకు చెప్పెను.

తే. గీ. మానవులకును రోగముల్ మాన్పునట్టి
యోషధిని భృంగరాజము నొసరసృష్టి
జేసె నప్పటి నుండియు క్షితిని హృద్య
వైద్యశాలలు ధన్యులై వాడుచుండ్రు. ॥

అప్పటినుంచి యీ గుంటగలగరాకును వైద్యు లందరు వాడుచుందురు.

క. అని భృంగరాజ మహిమము
వనిఋూనుక శుద్ధమైన ప్రతిగా జేసెన్
ఘనమైన దాసు వంశం
బున బుట్టిన రాము డధిక మోదముతోడన్. ॥

శ్లో. సలక్షా పద్మినీ జాయా భృంగరాజ్యస్య సర్వదా
తద్యోగే జాయతే శక్తిః సర్వరోగ నివారిణీ. ॥

దీని యర్థమును అర్హులయినవారు భృంగరాజ మహిమము పూర్తిగా దెలిసిన పెద్దల వలన గ్రహించ వలసినది.

(భృంగరాజ మహిమము సమాప్తము.)

---

ఈ ప్రాచీన గ్రంథమును శ్రమతో వెతికి యిచ్చి ప్రచురణకు ప్రోత్సహించిన శ్రీ దాసు పద్మనాభరావు గారికి కృతజ్ఞులము — — సంపాదకుడు.

మహాకవి దాసు శ్రీరామవిరచిత

# శ్రాద్ధసంశయ విచ్ఛేది

# పీఠిక

ఓ సత్పురుషులారా !

ప్రకృతమునందు వైశ్యకులమువారు మృతాహస్సులయం దన్నశ్రాద్ధము సేయరాదనియు, ఆమశ్రాద్ధము జరిగించవలసిన దనియు, వైశ్యులలో వైశ్యులు భోక్తలుగా నుండవలసి వచ్చును గాన నట్లు భోక్తలుగా వైశ్యులుండుట పనికి రాదనియు, భోక్తలు ప్రతిగ్రహీతలు కావలసి వచ్చును గాన ప్రతిగ్రహణము సుతరాం వైశ్యులకుఁ గూడదనియు, పరిషత్కాల మంత్రములు మొదలగు వానిలో బ్రాహ్మణులే కొనియాడ బడినారుగాన అట్టి బ్రాహ్మణత్వము వైశ్యులకు అసంభవమనియు బందరు మొదలగు స్థలములయందు అనేకులగు బ్రాహ్మణులు దుర్వాదములు సేయుచున్న సంగతి యందరికి విశదమే. ఈ యంశములలో శాస్త్ర జ్ఞానము లేనివారికి బ్రాహ్మణులు సేయు దుర్వాదము సత్యమే యని తోచవచ్చును. కాని అది భ్రాంతి. కొంచము ఓపికతో ఈ చిన్న పుస్తకమును చదువుడు. ఇందులో నుదాహరింప బడిన ధర్మశాస్త్రములను తెప్పించి చూచి అర్థ జ్ఞానముకలవారివలన వాని యర్థమును వినుండు. మీకు సంశయము విడుచును. తరువాత శ్రాద్ధ విషయములో వైశ్యులకును బ్రాహ్మణులకును లేశము భేదము లేదని తెలియును.

ఈ యంశమును ఇదివరకు నేనురచించి ప్రకటించియున్న

"వైశ్య ధర్మదీపిక" యందలి మూడవ సూత్రము, "సర్వేద్విజ సామాన్య ధర్మావైశ్యైరనుష్ఠేయా ఏవ" వలననే స్పష్టమగు చున్నది. కాని వివరముగా తెలియుటకు "శ్రాద్ధసంశయ విచ్ఛేది" యను ఈ యుపన్యాసమును జయసంవత్సర వైశాఖ మాసములో బందరు గూడూరు మొదలగు ప్రదేశములందు నా వలన ప్రసంగింప బడినది.

తప్పులు క్షమింపుడు, ఒప్పులు గ్రహించుడు.

మీ విధేయుడు.
దాసు శ్రీరాములు
ఏలూరు

శ్రీ ర స్తు

# శ్రాద్ధ సంశయ విచ్ఛేది

శ్లో॥ బ్రహ్మైవాహంసదై కోహ మఖండః పరమార్థతః
వ్యవహార విచారాయ నమామి పరమేశ్వరమ్॥
శ్రూయతా మవధానేన ధీరా ధీరామతీయుతం
శ్రాద్ధసంశయవిచ్ఛేద సాధనం వచనంమమ

1. శ్రాద్ధభేద విచారము - మొదటి ఘట్టము.

స్వసిద్ధాంతములు- శ్రాద్ధము అనునది మూడువిధములుగా నున్నట్లు ధర్మశాస్త్రముల వలన గానవచ్చుచున్నది. ఆ విధములు

అన్నశ్రాద్ధము - పక్వాన్నముతో చేయునది.

ఆమశ్రాద్ధము - వండని పదార్థములతో చేయునది.

హిరణ్యశ్రాద్ధము - బంగారు, వెండి, రాగి, మొదలగు వానితో జరిగించునది.

2. పితృదేవతల నుద్దేశించి శ్రద్ధతో నిచ్చు నన్నము మొదలగువానిపేరే శ్రాద్ధము.

శ్రాద్ధము మూడువిధములై యుండునటకు ప్రమాణములు.

లోకాక్షిపరాశరస్మృతి ఆచారకాండము

పుష్పవత్స్వపిదారేషు । విదేశస్థోప్యనగ్నికః
అన్నేనైవాబ్దికం కుర్యాత్ । హేమ్నావామేనవాక్వచిత్

అన్నహేమ, ఆమశ్రాద్ధములీ శ్లోకమున సూచింపబడినవి.

యల్లాజీయము పుట.226 గౌతముడు

ప్రత్యాబ్దికే మాసికేచపక్వాన్నం నైవలభ్యతే
ఆమశ్రాద్ధం ద్విజః కుర్యాత్ హేమ్నాహితదసంభవే॥

అన్న, ఆమ, హేమ శ్రాద్ధములు వరుసగా ఈ శ్లోకము నందు గానవచ్చుచున్నవి.

౬. ద్విజులనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు అన్న శ్రాద్ధములే జరిగించవలయును. శూద్రులు ఆమశ్రాద్ధములే జరిగించవలయును. ఆపత్తున ద్విజులామము సేయవచ్చును. ఇందునకు ప్రమాణములు.

ఔశనసస్మృతి ౫ అధ్యాయము ౭౬ శ్లోకము

ఆమానివర్తయేన్నిత్యం ఉదాసీనోనతత్వతః
అనగ్నిరథ్వగోవాపి । తద్వైవవ్యసనాన్వితః
ఆమశ్రాద్ధం ద్విజఃకుర్యాత్ । వృషలస్తుసదైవహి

అర్థము:- ఎల్లప్పుడును ద్విజులు అన్నశ్రాద్ధమే జరిగించవలెను.

భార్యాహీనుడు, ప్రవాసి, వ్యసనముతో గూడినవాడు మాత్ర మామము జరిగించవచ్చును. శూద్రుడు మాత్రమెల్లప్పుడును, ఆమమే జరిగించవలసినది. ఆమము చెప్పినచోట హిరణ్యముకూడ గ్రహించదగినది.

పరాశరమాధవీయము ఆచారకాండము శ్రాద్ధప్రకరణము

కాత్యాయనుడు వ్యాఘ్రపాదుడు

ఆపద్యనగ్నౌతీర్థేచప్రవాసేపుత్రజన్మని
అమశ్రాద్ధం ప్రకుర్వీతయస్యభార్యారజస్వలా,
ఆర్తవే దేశకాలాది విప్లవేసముపస్థితే
అమశ్రాద్ధంద్విజః కుర్యాత్ శూద్రః కుర్యాత్సదైవహి.

భార్యలేనప్పుడు ప్రయాణములో పుత్ర జన్మమందు ఆమ శ్రాద్ధము జరిగంచవలసినది. భార్యవాకిటనున్నప్పుడు దేశకాలోప ద్రవములయందు ఆమ శ్రాద్ధము కూడును. ఇది ద్విజులవిషయము శూద్రులెల్లప్పుడును ఆమమేచేయువలసినది ద్విజులు ఆపత్తు లేనప్పుడుఅన్నషే చేయువలసినదని యర్థము.

కూర్మపురాణము బ్రాహ్మణకసహితవ్యాసగీతలు ౨౧వ

అధ్యాయం 77 శ్లోకము మొదలు

ఆమేనవర్తయేన్నిత్యముదాసీనోవతత్వతః ।
అనగ్నిరధ్వగోవాపి తద్వైవవ్యసనాన్వితః।
ఆమశ్రాద్ధం ద్విజః కుర్యాత్ వృషలస్తుసదైవహి

మొదటి మూడు వర్ణములవారు అన్నశ్రాద్ధమే చేయవలసి వది. భార్యలేనివాడు, ప్రవాసి, వ్యసనము కలవాడు ఆమశ్రాద్ధము చేయవచ్చును. నాల్గవవర్ణమువారు మాత్రము సర్వదా ఆమము చేయవలెను,

4. ద్విజులలో ఆపత్తులయందైనను తద్దినము, సపిండము గయాశ్రాద్ధము, మహాలయము ఇవి ఆమముచేత జరిగించ కూడదు.

ఇందునకు ప్రమాణములు,

నిర్ణయసింధువు తృతీయ పరిచ్ఛేదము — శ్రాద్ధనిర్ణయము
స్మృతిదర్పణము

మృతాహంచ సపిండంచ గయాశ్రాద్ధంమహాలయం
ఆపన్నోపిన కుర్వీతశ్రాద్ధమామేనకర్హిచిత్

తద్దినము, సపిండము, గయాశ్రాద్ధము, మహాలయము, ఇవి ఆపత్తునందైనను ఆమముచేత పెట్టరాదు. అని యిందు చెప్పబడినది. తద్దినములనుటచే మాసికములు కూడ గ్రహించ దగినది. పరాశర మాధవీయమును చూడుము. ౧౨౫పుట

శ్రాద్ధవిఘ్నే ద్విజాతీనా। ఆమశ్రాద్ధం ప్రకీర్తితం।
అమావాస్యాదినియతం మాససాంవత్సరాదృతే।

5. ద్విజులలో తద్దినము, మాసికములు, సపిండము, గయ శ్రాద్ధము మహాలయము ఇవి అన్నముతోనే జరిగించవలసినది.

ఇందునకు ప్రమాణములు

తదామశ్రాద్ధంమృతేహనినకుర్యాత్।
కింతుపక్వాన్నేన కుర్యాదిత్యర్థః
అర్థము స్పష్టము.

లోకాక్షి

పుష్పవత్స్వపిదారేషు విదేశస్థోప్యనగ్నికః
అన్నేనై వాబ్దికం కుర్యాత్ హేమ్నా వా మేనవాక్వచిత్॥

ఇందు ఆపత్తులయందైనను ఆబ్దికములు మాత్రమన్నము చేతనే జరిగించవలయునని చెప్పబడియున్నది.

6. తద్దినము మాసికము మొదలయిన వానియందైనను ద్విజులకు అన్నమే సంభవించనప్పుడు ఆమముగాని హిరణ్యము గాని చేయవచ్చును.

ఇందునకు ప్రమాణములు

యల్లాజీయము పుట 6 గౌతముడు

ప్రత్యాబ్దికే మాసికేచ పక్వాన్నం నైవలభ్యతే
ఆమశ్రాద్ధం ద్విజః కుర్యాత్ హేమ్నా వా తదసంభవే

7. ద్విజుడు ప్రత్యాబ్దికాదుల యందన్నమే దొరకనియెడల ఆమముగాని హిరణ్యముగాని జరిగించవచ్చును.

ఈ పైన వ్రాయబడిన ఆరు సిద్ధాంతముల వలనను తేలిన పర్యవసితార్థ మేమనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు అన్నము దొరికినప్పుడు ఎట్టియాపత్తు పందైనను తద్దినములు, మాసికములు. సపిండము, మహాలయము, గయాశ్రాద్ధము, అన్నము

చేతనే జరిగించవలసినది గాని ఆమముచేత జరిగించరాదు. శూద్రుడామముచేతనే సర్వదా శ్రాద్ధము జరిగించవలసినది.

శ్రాద్ధభేదవిచారోయం సర్వశాస్త్రార్థసమ్మతః।
దాసు పంచాబ్ది సంద్రేణ కృత శ్రీరామశర్మణా॥
శ్రాద్ధభేదవిచారము– సమాప్తము.

శ్లో॥ ఏకఏవా ద్వితీయోహం నానాత్వం నాస్తికించవ।
తథాపి వ్యవహారార్థం నమామి హరిమచ్యుతమ్॥

## 1. శ్రార్ధభోక్తృవిచారము–రెండవఘట్టము.

### –: స్వసిద్ధాంతములు :–

1. శ్రాద్ధభోక్తలు ముఖ్యకల్పభోక్తలు, అనుకల్పభోక్తలు నని రెండువిధములుగ నుందురు.

ఇందునకు ప్రమాణములు ముందువ్రాయబోవు శ్లోకార్ధముల యందే కానవచ్చును.

2. ముఖ్యకల్పభోక్తలలో మూడు తరగతులు కలవు.
మొదటి తరగతివారు – యతులు.
రెండవ తరగతివారు – వేదవేత్తలు, బ్రహ్మచారులు,
మూడవ తరగతివారు – శ్రోత్రియబ్రాహ్మణులు.

ఇందునకును ప్రమాణములు దిగువ వ్రాయబడు శ్లోకార్థముల వలననే తెలియబడును.

3. అనుకల్పభోక్తలు మేనమామ మొదలగు బంధువులు. దీనికిని ప్రమాణములు క్రింద వ్రాయబడును.

4. ముఖ్యకల్ప భోక్తలలో నేతరగతివారును దొరకనప్పుడు అనుకల్పభోక్తలకు శ్రాద్ధము పెట్టవలయును.

ఈ పయినాలుగు విధులకును ప్రమాణములు.

మనుస్మృతి 3 అధ్యాయము 134- 135- 138- 142 శ్లోకములు

జ్ఞాననిష్ఠా ద్విజాః కేచిత్ తపోనిష్ఠా స్తథాపరే
తపస్స్వాధ్యాయనిష్ఠాశ్చ కర్మనిష్ఠా స్తథాపరే
జ్ఞాననిష్ఠేషుకవ్యాని ప్రతిష్ఠాప్యాని యత్నతః॥
హవ్యానితు యథాన్యాయం సర్వేష్వేవ చతుర్ష్వపి
శ్రోత్రియాయైవదేయాని హవ్యకవ్యాని దాతృభిః
అర్హత్తమాయవిప్రాయతస్మైదత్తం మహాఫలం
ఏషవై ప్రథమః కల్పః ప్రధానో హవ్యకవ్యయోః॥

ఇందు ముఖ్యకల్పభోక్తలు చెప్పబడినారు.

అనుకల్పస్త్వయంజ్ఞేయః సదాసద్భిరనుష్ఠితః
మాతామహం మాతులంచ స్వస్రీయం శ్వశురం గురుం
దౌహిత్రం విట్పతిం బంధుం ఋత్విగ్యాజ్యౌచ భోజయేత్॥

ఇందు అనుకల్ప భోక్తలు చెప్పబడినారు.

గౌతమస్మృతి 10 వ అధ్యాయము 17 శ్లోకము
శ్రాద్ధకాలే యతింప్రాప్తం పితృస్థానేతు భోజయేత్॥

ఇందు ముఖ్యకల్పములో మొదటితరగతిభో క్త యః చెప్పబడినాడు.

పైస్మృతి 22 వ శ్లోకము

సన్నికృష్టం ద్విజంయస్తు యుక్తజాతిం ప్రియంవదః
మూర్ఖంవా పండితంవాపితృప్తిహీన మథాపివా
నాతి కమేన్నరో విద్వాన్ దారిద్ర్యాభి హతం తథా॥
పయిస్మృతి పయిఅధ్యాయం 24 25 శ్లోకములు
సంబంధిన స్తథా సర్వాన్ దౌహిత్రం విట్పతిం తథా
భాగినేయం విశేషేణ తథాబంధూశ్చ నారద
అతిక్రమ్య హఠాత్కామాత్ రౌరవం నరకం ప్రజేత్.
ఇందు అనుకల్ప భోక్తలు చెప్పబడిరి.

15 శ్లోకము

మాతులో భాగినేయశ్చ జామాతా స్వసృజోపివా
అనుకల్పా ఇమే ప్రోక్తా బాంధవాశ్చోపకారిణః॥
ఔశనసస్మృతి 4 వ అధ్యాయము 17 19 శ్లోకములు

తస్మాద్యత్నేన యోగీంద్రాన్ ఈశ్వరజ్ఞానతత్పరాన్
భోజయేద్ధవ్య కవ్యేషు అలాభే చేతరాన్ ద్విజాన్

ఇందు ముఖ్యకల్పము మూడు తరగతుల భోక్తలు జెప్పబడిరి.

మాతామహం మాతులంచ స్వస్రీయంశ్వశురం గురుం
దౌహిత్రం విట్పతింబంధుం ఋత్విగ్యాజ్యౌచ భోజయేత్॥

ఇందు అనుకల్ప భోక్తలు చెప్పబడిరి.

లిఖితస్మృతి 35 శ్లోకము

బ్రాహ్మణానా మభావేతు భ్రాతరం పుత్రమేవహి
ఆత్మానంవా నియుంజీతన విప్రం వేదవర్జితం

౬5 వ శ్లోకము

మాతామహం మాతులంచ స్వస్రీయం శ్వశురం గురుం
దౌహిత్రం విట్పతించైవ ఋత్విగాదీంశ్చ భోజయేత్॥

ఇందు అనుకల్పభోక్తలు చెప్పబడిరి.

యాజ్ఞవల్క్యస్మృతి ఆచారకాండ 21౦ శ్లోకము మొదలు

అగ్రిస్సర్వేషు వేదేషు శ్రోత్రియో బ్రహవిద్యావేదార్థం
జ్యేష్టసామా త్రిమధుస్త్రిసువర్ణికః స్వస్రీయఋత్విగ్జామాతా
యాజ్యశ్వశురమాతులాః త్రిణాచికేత దౌహిత్రశిష్యసంబంధి
బాంధవాః

ఇందు ముఖ్యకల్పాను కల్పములు రెండును జెప్పబడినవి.

పరాశరమాధవీయం శ్రాద్ధనిర్ణయఘట్టము శంఖుడు

నిత్యయోగపరోవిద్వాన్ సమలోష్టాశ్మ కాంచనః
ధ్యానశీలోయతిర్విద్వాన్ బ్రాహ్మణాః పఙ్క్తిపావనాః

అత్రానుకల్పో యాజ్ఞవల్క్యేన దర్శితః॥ అని

స్వస్రీయ ఋత్విగ్జామాతా యజ్యశ్వశురమాతులాః
త్రిణాచికేత దౌహిత్రశిష్యసంబంధిబాంధవాః

ఇందు ముఖ్యానుకల్పములు రెండును జెప్పబడినవి,

అపస్తంబుడు గుణవదలాభే సోదరోపి భోజయితవ్యః॥ అని గుణవంతుడు దొరకనిచో సోదరుడయినా భోక్త కావచ్చును.

విష్ణుపురాణేపి అని

పితవ్యగురుదౌహిత్రాన్ ఋత్విక్స్వస్రీయమాతులాన్
పూజయేద్ధవ్యగవ్యేచ వృద్ధానతిథిబాంధవాన్
అందు అనుకల్పము చెప్పబడినది.

ఈ యనుకల్పమనునది ముఖ్యకల్పభోక్తలు లభించనపుడు అని తెలియుచున్నది। అనుకల్పభోక్తలు బంధులే కాన క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణ బంధువు లిక్కలియుగంబున సంభవించరు గాన సజాతీయులే అనుకల్పభోక్తలనుట స్పష్టమే. మరియును

కూర్మపురాణము వ్యాసగీత 21 వ అధ్యాయము 14 శ్లోకము మొదలు 18 వరకు

భోజయేద్యోగినం పూర్వం తత్వజ్ఞానపరం యతిం
ఇదిముఖ్యకల్పము.

పరాశరమాధవీయము ఆచారకాండము శ్రాద్ధభోక్తృనిర్ణయ ఘట్టము వసిష్ఠోపి అని

యతీన్గృహస్థాన్ సాధూన్ వా భోజయేదితి శేషః

యతునిగాని, గృహస్థునిగాని సాధువునిగాని భుజింపచేయువచ్చును.

బ్రహ్మాండపురాణేపి అని

శిఖిభ్యోధాతురక్తేభ్యః త్రిదండిభ్యశ్చ దాపయేత్
శిఖినోబ్రహ్మచారిణః ధాతురక్తవస్త్రధారిణో వానప్రస్థాః
త్రిదండినో మనోవాక్కాయదండై రుపేతాః యతయః
అత్రపరః పరఃశ్రేష్ఠః అతఏవ నారదః
యోవై యతీన నాదృత్య భోజయేదితరాన్ ద్విజాన్
విజానన్ వసతో గ్రామే కవ్యంతద్యాతి రాక్షసాన్

బ్రహ్మాండపురాణేపి

అలాభే మునిభిక్షూణాం భోజయేత్ బ్రహ్మచారిణం
తదలాభేప్యుదాసీనం గృహస్థమపి భోజయేత్

ఇందు ముఖ్యకల్పము మూడుతరగతులవారును చెప్పబడిరి.

ఈ పయిన వ్రాయఁబడిన నాలుగు సిద్ధాంతముల వలనను తేలిన పర్యవసితార్థమేమనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు అన్న శ్రాద్ధములు పెట్టునప్పుడు భోక్తల విషయమై రెండు కల్పము లనియు అవి ముఖ్యకల్పము అనుకల్పము అనియు, మొదటి

తరగతివారు యతులు, రెండవ తరగతివారు బ్రహ్మచారులు మూడవతరగతివారు గృహస్థులనగు బ్రాహ్మణులనియు అను కల్పమువారు సజాతీయ బంధువులనగా మేనమామ, అల్లుడు, మేనల్లుడు, మామగారు, తల్లితండ్రి మొదలగువారనియు ముఖ్య భోక్తలలో నెవ్వరును లభించనప్పుడు అనుకల్ప భోక్తలకే శ్రాద్ధము జరిగించవలసినదనియు.

శ్రాద్ధభోక్తృ విచారోయంసర్వశాస్త్రార్థ సమ్మతః
దాసువంశాబ్ధి చంద్రేణ కృతశ్రీ్మరామశర్మణా

శ్రాద్ధభోక్తృవిచారము సమాప్తము.

శ్లో. నిత్యోహంనిర్మలోహంచ-నిశ్చలో నిరుపాధికః
లోకసంగ్రహవార్తాయాం నమామి పురుషోత్తమం

2. అన్న శ్రాద్ధేషు క్షత్రియవైశ్యయోర్ముఖ్యకల్ప భోక్తృ లాభవిచారనుట్టము.

-: స్వసిద్ధాంతములు :-

1. శ్రాద్ధాన్నపాకము స్వగృహమునందు స్వబంధువులచే జేయింపవలయును.

ఇందునకు ప్రమాణములు.

పరాశరమాధవీయము ఆచారకాండము నియంత్రప్రకార

ఘట్టము తుదను దేవలోపి అని

తద్వైవ యంత్రితో దాతా ప్రాతస్స్నాత్వా సహాంబరః

అరభేత నవ్రైః పాత్రై రన్నారంభం స్వబాంధవైః

దీనవలన స్పష్టముగా శ్రాద్ధాన్నము బంధుపులే వండవలసి నట్లు కానవచ్చుచున్నది.

2. ఈ యుగంబు సజాతీయులే స్వబంధువులగుదురు. ఎందుచేతననగా విజాతీయ వివాహములు వర్జింపబడినందున ఇందుకు ప్రమాణములు.

వృద్ధపరాశరము

ద్విజానా మసవర్ణాసు కన్యాసూపయమ స్తథా

అసవర్ణవివాహములు కలియుగమున వర్జింపబడినవి.

3. శుచివ్రతులైన క్షత్రియ వైశ్యుల యన్నమును బ్రాహ్మణులు భుజించుట శాస్త్రమువలన నిషేధింపక పోయినను ఇప్పటి బ్రాహ్మణులు కొన్ని కారణములచేత భుజింపనొల్లకున్నారు. గాన బ్రాహ్మణభోక్తక్షత్రియ వైశ్యులకు లభించదు ఇందునకు పరాశరస్మృతి ప్రాయశ్చిత్తకాండము 11వ అధ్యాయము 1వ శ్లోకము

క్షత్రియశ్చాపి వైశ్యశ్చ క్రియావంతౌశుచివ్రతౌ

తద్గృహేషు ద్విజైర్భోజ్యం హవ్యకవ్యేషు నిత్యశః

హవ్యకవ్యములయందు శుచివ్రతులైన క్షత్రియ వైశ్యుల యిండ్లలో బ్రాహ్మణులు భోజనము చేయదగినది. యిట్లనేక ప్రమాణములుకలవు. కాని దురాచారములను ఆచారములనుకొని

యెంతకాలము మనదేశమువారు ప్రవర్తింతురో అంతవరకు బ్రాహ్మణులు క్షత్రియవైశ్యుల యిండ్లవారుచేసిన పాకమును భుజించరనుట విదితమే. బ్రాహ్మణుడే ముఖ్యకల్పభోక్తగావునను క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణభోక్త దొరకదు గావునను అనుకల్ప భోక్తలగు స్వబంధువులే భోక్తలు కావలసి వచ్చినది.

వక్ష్యాన్నోరాద్విశోర్ముఖ్య-కల్పాలాభస్తు సాంప్రతం ।
విప్రతో దాసుపద్ధిశశినా రామశర్మణా॥

ముఖ్యకల్పాలాభవిచారము – సమాప్తము

శ్లో. ఓమ్సర్వం ఖల్విదం బ్రహ్మ-తద్భిన్నంతునవిద్యతే।
ఆత్మజ్ఞానేనలోకార్థం-నారాయణముపాస్మహే॥

4. శ్రాద్ధేషుక్షత్రియవైశ్యోరనుకల్పభోక్తౄణాం మంత్రానుకూలతా విచారఘట్టము

–: స్వసిద్ధాంతములు ;–

"పునంతుమాం బ్రాహ్మణ పాద పాంసవః" అనునదియు "రక్షంతుమాం బ్రాహ్మణ పాద పాంసవః" అనునదియు "విప్రశ్రీ పాద పంకజః" అనునదియు విప్రౌఘదర్శనాత్సద్యః" అను నదియు "యావతీర్వై దేవతాస్తాస్సర్వా వేదవిద్బ్రాహ్మణే వసంతి తస్మాద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యోదివేదివేనమస్కుర్యాత్" అనునదియు, భోక్తృవిషయములు కావు. పరిషద్వందనముతో సంబంధించినవి పరిషత్తు అనగా నొకనికి ప్రాయశ్చిత్తము జరిగించుటకేర్పడిన బ్రాహ్మణసభ.

"కాలే అధికార సిధ్యర్థం యథాశక్తి సంభవ ప్రాయశ్చిత్తం కరిష్యే" అని ప్రారంభించి శ్రార్ధమునకు బూర్వమే అధికారసిద్ధి కొరకు బ్రాహ్మణసభకు నమస్కారముచేయుట యావశ్యకము.

అది భోక్తలకు చేయు నమస్కారము కాదు గావున వాని యందు బ్రాహ్మణ విప్ర పదములున్న మాత్రమున క్షత్రియ, వైశ్యభోక్తలకు యెంతమాత్రమును సంబంధించదు. ఈ మంత్రములు ఎల్ల ప్రాయశ్చిత్తముల యందును వచ్చును. శ్రాద్ధపూర్వాంగ ప్రాయశ్చిత్తమును తక్కిన ప్రాయశ్చిత్తముల వంటిదే. ఆ ప్రాయశ్చిత్తకాలమునందు భోక్తలపని యేమియులేదు. యాజక బ్రాహ్మణుడు కూడ వచ్చును.

2. "యదీచ్ఛసి మహారాజన్- సర్వతీర్థావగాహనం
విప్రపాదవినిర్ముక్తం తోయం శిరసిధారయేత్"

ఈ శ్లోకమును భోక్తలకు పాద్యమిచ్చి యాజలమును శిరస్సున నుంచుకొనునప్పుడు పఠించుచున్నారు. ఇది ఆగ్నేయ పురాణములోని శ్లోకము. దీని యర్థము- ఓ రాజా నీవు సర్వతీర్థములయందు స్నానముచేయు నిశ్చయించితివా విప్రపాదముల నుండి జారిన నీటిని శిరస్సున నుంచుకొనుము అని యున్నది. ఈ శ్లోకము భోక్తలపాద్యకాలమున చదువుటకంటె వెర్రి వేరేలేదు. భోక్తను ఎదుటనుంచుకొని, ఓ రాజాయని పిలుచుటయు మీకు సర్వతీర్థావగాహనమందు ఇచ్ఛగలిగియున్నట్లైన, యనుటయు విప్రపాదతీర్థమును శిరస్సున ధరించుకొమ్ము అనుటయు ఎంత అసందర్భముగానైన నున్నది కావున ఈ శ్లోకము ఆబ్దికమంత్రములో చేర్పరాదు.

ఒకవేళ ఈ శ్లోకము పఠించినను బ్రాహ్మణకర్త బ్రాహ్మణ భోక్త వీర్వురున్నప్పుడు విప్రతీర్ధమహిమను గొనియాడుకొనుట ఉదాహరణముగా జెప్పుకొనిన తప్పులేదు.

3. "ఓషధయస్సంవదంతే- సోమేనసహరాజ్ఞాయస్మై
కరోతి బ్రాహ్మణఃతగ్ం-రాజన్‌పారయామసి॥

ఈ మంత్రము ఆవాహనానంతరము అక్షతలు భోక్తలమీద జల్లునప్పుడు వచ్చును. ఇందులోని బ్రాహ్మణపదము కర్తకర్థము గాని భోక్తకు సంబంధించదు.

దీనియర్థమేమనగా

సోముడనేరాజుతో ఓషధులు జెప్పుచున్నవి.

ఓరాజా ఏ ఫలము కొరకు బ్రాహ్మణుడు కర్మను చేయుచున్నాడో దానిని మేము తుదముట్టించుచున్నారము.

ఈ మంత్రము వలన భోక్తలు క్షత్రియు వైశ్యులుగా నున్నవు దేయసందర్భమును లేదు.

4. ఇయంభూర్గయా ఏతేబ్రాహ్మణాగదాధరాః అనుచోటను- దేవతేదమన్నం కవ్యం బ్రాహ్మణ స్త్వాహవనీయార్థే దత్తం అను చోటను దక్షిణేన బ్రాహ్మణంస్పృశన్ అనుచోటను ఉదాహరణములుగా బ్రాహ్మణ పదములు చెప్పబడినవి.

శ్రీనివాసశర్మా అనియు శ్రీనివాసశర్మణం అనియు ఉదాహరణములుగా జెప్పినంత మాత్రముచేత అవే మంత్రములు కావు. గోవిందశర్మా అనవచ్చును రామవర్మా అనవచ్చును. అప్పుడు భోక్తలుగా గూర్చుండువారెవ్వరో అదిచూచి మార్చుకొన వచ్చును.

యజమానస్య పితుః అని ప్రయోగములో వ్రాసినంత మాత్రముచేత తన భ్రాతకు తద్దినము పెట్టువాడుకూడను యజమానస్య పితుః అనరాదు. అస్మద్భ్రాతుః అనవలెను. అలాగుననే దక్షిణేన బ్రాహ్మణం స్పృశన్ అనిన దానిచేత వైశ్యభోక్త ఉపవిష్టుడైనప్పుడు మరియొకచోటనున్న బ్రాహ్మణుని ముట్టుకొనుమని అర్థముకాదు. భోక్తయగువాని దాకుమని యర్థము చేసికొనవలయును.

నాందీశ్రాద్ధమునందు అభ్యుదయిక బ్రాహ్మణ భోజనాచ్ఛాదన ప్రత్యామ్నాయ యథాశక్తి హిరణ్యం తుభ్యమహం సంప్రదదేనమమ అనియున్నది. క్షత్రియవైశ్యోపనయనములయందు బ్రాహ్మణులెట్లుగా సంభవింతురు ? బ్రాహ్మణశబ్దము చెప్పుటచేత ఆయా వర్ణములవారికి ఎవ్వరాభ్యుదయికు లగుదురో వారేయని అర్థము చేయకతప్పదు.

ఈపైన వ్రాయబడిన నాలుగు సిద్ధాంతముల వలన తేలిన పర్యవసితార్థమేమనగా

ఆబ్దికమంత్రములలో గొన్ని పరిషద్వందనాలతో సంబంధించి భోక్తలతో సంబంధించనందునను కొన్ని అనావశ్యకములు, అసందర్భములునగు శ్లోకములు జేర్పబడినందునను కొన్ని యుదాహరణ రూపకముగా ప్రయోగకారులు వ్రాసిన మాటలైనందునను బ్రాహ్మణ విప్రపదములు మాత్రము కానవచ్చునంత మాత్రముచేత క్షత్రియవైశ్యలు భోక్తలుగానుండకూడదని చెప్పరాదు-

రాద్వి శోరనుకల్పేతు - క్రియామంత్రానుకూలతా ।
దాసువంశాబ్ధిచంద్రేణ - వివృతారామశర్మణా ॥

క్షత్రియ వైశ్యానుకల్ప శోక్తమంత్రానుకూలతా ఘట్టము సమాప్తము.

శ్లో. సదహం చిదహం సోహం - అనందోహం నిరాకులః
మాయాప్రపంచసమ్మర్శే - భజామిశివమీశ్వరం॥

5. శ్రాద్ధేషు క్షత్రియ వైశ్యయో ర్బ్రాహ్మణ యాజకస్యైవ ముఖ్యత్వవిచారఘట్టః

:- స్వసిద్ధాంతములు :-

1. క్షత్రియవైశ్యులకు యాజనాధ్యాపనప్రతిగ్రహములు విహితములుకావు. యజనాధ్యయన దానములు మాత్రమే విహితములు.

ఇందునకు ప్రమాణములు "వైశ్యధర్మదీపిక "యందు సవిస్తరముగా వ్రాయబడినవి ఇచ్చట తిరిగి వివరించవలసినదిలేదు

విజ్ఞానేశ్వరీయం

ఇజ్యాధ్యయనదానాని వైశ్యస్యక్షత్రియస్యచ
ప్రతిగ్రహోధికో విప్రేయాజనాధ్యా పనేతథా॥

2. క్షత్రియవైశ్యులు యాజకత్వమునకు బ్రాహ్మణులు దొరకని మహాపత్తునందు దమలోతాము యాజకత్వమవలంబించవచ్చును.

ఇందునకు ప్రమాణములు-

"వైశ్యధర్మదీపిక" యందు 5 వ సూత్రము [అపదీతరేపి] వివరించుటతో వ్రాయఁబడినవి. గౌతమసంహిత [యాజనాధ్యాపన ప్రతిగ్రహా సర్వేషాం.]

శ్రాద్ధేషురాద్విశోర్విప్ర - యాజకత్వస్యముఖ్యతా :
వివృతా దాసువంశాబ్ది - శశినా రామశర్మణా॥
విప్రయాజకత్వముఖ్యతా విచారఘట్టము సమాప్తము.

శ్లో. నిర్లేపోనిరహంకారో - నిరాలంబో నిరుత్తమః।
శివోహం లోకదీక్షాయాం - భావయే పార్వతీపతిం ॥

6. క్షత్రియ వైశ్యభోక్తౄణాం ప్రతిగ్రహణ విచార ఘట్టః

:- స్వసిద్ధాంతములు :-

1. యాజకుడువేరు, భోక్తవేరు.

యాజకుడు కర్మచేయించువాడు. కర్మచేయువాడు యజమానుఁడు లేక కర్త. అన్నమును భుజించువాడు భోక్త.

2. భోక్తకు ప్రతిగ్రహణముతో బనిలేదు కాని యుపచారములయందును సాద్గుణ్యార్థమగు దక్షిణయందును ప్రతిగ్రహణ యోగ్యత గలదు ఏలననగా

బ్రహ్మచర్య భిక్షాప్రతిగ్రహణము, ఔపచారికద్రవ్య ప్రతిగ్రహణము, కన్యాప్రతిగ్రహణము, సాద్గుణ్యార్థ దక్షిణాప్రతిగ్రహణము ఇవి క్షత్రియవైశ్యులకును అథవా శూద్రులకును విహితములే.

3. క్షత్రియ వైశ్యుల కిక్కాలంబున ననుకల్పభోక్తలే సిద్ధించుటవలనను, అనుకల్పభోక్తలు బంధువులై నందునను, బంధువులకిచ్చు దానము తక్కిన దానములకంటె కోటి గుణితమై నందునను, క్షత్రియవైశ్య భోక్తలు ముఖ్యముగా ప్రతిగ్రహణమున కర్హులే.

ఇందులకు ప్రమాణములు

బృహత్పారాశరీయము 4వ అధ్యాయము

బ్రాహ్మణోవిప్రగేహేషు - నృపస్త్రేషూత్తమేషుచ
వైశ్యోవిప్రనృపస్వేషుకుర్యాద్భిక్షాంస్వవృత్తయే
ఏకాన్నంచ దిజోశ్నీయాత్ - బ్రహ్మచారివ్రతేస్థితః
భిక్షావ్రతం ద్విజాతీనాం ఉపవాసమం స్మృతం
ప్రతిగ్రహోనభిక్షాస్యాత్ - నతస్యాఃపరపాకతా॥

క్షత్రియవైశ్యులు భిక్షాప్రతిగ్రహణము చేయవచుననియు అది ప్రతిగ్రహణమే అనరాదనియు దీనివలన దేటబడును.

యాజ్ఞవల్క్య స్మృతి ఆచారకాండము ప్రథమాధ్యాయము

పాణింగ్రాహ్యసవర్ణాంసం - గృహీణయాత్
క్షత్రియాశరం వైశ్యాప్రతోదమాదద్యాత్

ఇందు కన్యాప్రతిగ్రహణము చెప్పబడినది, - కన్యాప్రతిగ్రహణము కూడదనువారు లేనేలేరు గాన ఈ అంశము విస్తరించబనిలేదు.

వివాహప్రయోగము — కన్యాదానము

ఉత్తానసాగ్వీంరసః ప్రతిగృహాణతు కన్యాదాన సాద్గుణ్యార్థం
దక్షిణాం తుభ్యమహం సంప్రదదేనమమ -సాలగ్రామదానం

ఇతి.

కన్యాప్రతిగ్రహణము ధర్మమైనప్పుడు తదంగమైన సాద్గుణ్యార్ధ దక్షిణయునెట్లు ప్రతిగ్రహించవచ్చునో అట్లే శ్రాద్ధభోక్తృత్వము ధర్మమైనపుడు తదంగములైన యుపచారకములను సాద్గుణ్యార్థ దక్షిణయు ప్రతిగ్రహించవచ్చును.

ఇదియుగాక

క్షత్రియుల ఇంటికి క్షత్రియులును వైశ్యుల యింటికి వైశ్యులును అతిధి కాకూడదా? వాళ్ళకు ఆతిధ్యమిచ్చి అర్ఘ్యపాద్యాదుల బూజించి వసనాది సత్కారములు చేసిపంపకూడదా? ఇంతమాత్రము చేత క్షత్రియవైశ్యులు ప్రతిగ్రహణము చేసినట్లేనా?

పరాశరస్మృతి చూడుము

సంధ్యాస్నానం జపోహోమో - దేవతానాంచ పూజనం
ఆతిధ్యం వైశ్వదేవంచ షట్కర్మాణి దినే దినే॥

ఇందు ద్విజులు నిత్యమును చేయవలసిన కర్మలు చెప్పబడినవి. ఆతిధ్యమొకకర్మ - ఇప్పటి క్షత్రియ వైశ్యులకు బ్రాహ్మణాతిధ్యమెట్లు సంభవించును- క్షత్రియవైశ్యులే సంభవింతురు- వారికి యధావిధి అన్ని సత్కారములును జరుగవలసినదేకదా- ఆతిధ్యము ధర్మమైనప్పుడు సాద్గుణ్యార్ధ దక్షిణయు ధర్మమే.

పరాశరమాధవీయము 34వ పుట భవిష్యోత్తర
పురాణమునందు

నకేవలం బ్రాహ్మణానాం-దానం సర్వత్రశస్యతే
భగినీ భాగినేయానాం మాతులానాం పితృష్వసుః
దరిద్రాణాంచబంధూనాం దానంకోటిగుణంభవేత్
ఈ శ్లోకము వలన సకల సందేహములును నివృత్తియగుచున్నవి.

ఇందులో నిజమైన యర్థము అన్ని కర్మల యందును బ్రాహ్మణులకే దానము చేయుట ప్రశస్తము కాదు.

తోబుట్టువు- తోబుట్టువు కొడుకు- మేనమామ- మేనత్త- దరిద్రులు- ఇంకను ఇటువంటి బంధువులు - వీరికిచేసినదానము కొన్ని యెడల బ్రాహ్మణులకు జేసిన దానమునకంటె కోటిగుణిత మైన ఫలమిచ్చును.

యెల్లకర్మల యందనుటచేత కొన్నింటియందు బ్రాహ్మణులు మాత్రమే ప్రతిగ్రహీతలనుట నిశ్చయమే కాని కొన్నిట క్షత్రియ వైశ్యులు వారిలో వారి బంధువులే ప్రతిగ్రహీతలైనచో నుత్తమపక్షమని ఈ శ్లోకము వక్కాణించుచున్నది,

భోక్తలకిచ్చువస్త్రపాత్రాదుకాలౌపచారికములు
క్షత్రియవైశ్యులలో భోక్తలుగా నుండువారు బంధువులే.
భోక్తలకిచ్చు దక్షిణ శ్రాద్ధసాద్గుణ్యార్థమైనది.
కావుననిందు ప్రతిగ్రహణమేమున్నది. ఒకవేళ అది యున్నను నిషిద్ధమేలయగును ?

ప్రతిగ్రహణము సుతరాం పనికిరాని యతికి ముఖ్యముగా భోక్తృత్వ యోగ్యతకఖదేకదా

శ్లో॥ నృపాల వైశ్యభోక్తౄణాం-ప్రతిగ్రహణయోగ్యతా।
విప్రతాదాసువంశాబ్ధిశ - శినా రామశర్మణా॥
క్షత్రియవైశ్య భోక్తృప్రతిగ్రహవిచారము సమాప్తము.

శ్లో॥ అన్నప్రాణమనోవిజ్ఞా-నానందాత్మానమచ్యుతం।
ప్రాతిభాషికవృత్తేస్మిన్-వందే నందాత్మజంగురుం॥

7. క్షత్రియవైశ్యయోరామశ్రాద్ధదురాచార పరిత్యాజ్యతా విచారఘట్టము

1. క్షత్రియవైశ్యులలో తిద్దినాదులయం దామశ్రాద్ధములు జరిగించుట నిషిద్ధాచారము గాన అది మాని యన్నశ్రాద్ధములే జరిగించవలయును.

2. దురాచారము కొంతకాలమునుండి జరిగివచ్చుచున్నను దానిని మానుట దోషముకాదు.

ఇందునకు ప్రమాణములు.

ఇదివరకే నేను రచియించి ప్రకటించియున్న "వైశ్య ధర్మదీపిక" యందు 7వ సూత్రము— దురాచార పరిత్యాగాత్ సదాచార సంగ్రహాత్పూతాభవంత్యేవ" వివరించుటలో సవిస్తరముగా వ్రాయబడినది. ఇందు మిక్కిలి వ్రాయవలసినది లేదు.

గౌతమస్మృతి 1వ అధ్యాయము 10వ శ్లోకము
సమయశ్చాపి సాధూనాం ప్రమాణం వేదవత్తరాం।
శ్రుతిస్మృతిపురాణానాం ధర్మస్యాదవిరుద్ధకః

మనుస్మృతి 12 వ అధ్యాయము 106, 108 శ్లోకములు

అర్షంధర్మోపదేశంచ వేదశాస్త్రావిరోధినా।
యస్తర్కేణానుసంధత్తే సధర్మం వేదనేతరః
అనామ్నాతేషు ధర్మేషు కథంస్యాదితిచేద్భవేత్।
యంశిష్టాబ్రాహ్మణాబ్రూయుః సధర్మస్స్యాదశంకితః

వీనివలన—

శాస్త్రమునకు విరుద్ధముగాని యాచారమును విడువరాదనియు, శాస్త్రమునకు విరుద్ధమైన యాచారమును విడువవలసినదనియు దెలియచున్నది. ఇట్లుండగా శాస్త్రములయందు నిషేధింబబడిన ఆమశ్రాద్ధదురాచారమును విడువ కూడదనువాడు కలడని తోచదు.

శ్లో అమశ్రాద్ధదురాచర - పరిత్యాగవిచారణా।
వివృతాదాసువంశాబ్ధి - శశినారామశర్మణా॥
అమశ్రాద్ధపరిత్యాగివిచారషట్కము సమాప్తము.

శ్లో నాహంద్రవ్యంగుణంనాహం - నజాతిర్నక్రియాత్వహం
అవిద్యాస్మరణాదేవ - అష్టకామేశ్వరంభజే॥

8. ఉపన్యాసోపసంహారకాలే సర్వార్థసంగ్రహఘట్టః

సూత్రములు:

1. సూ. అన్నామహిరణ్యభేదాచ్ఛ్రాద్ధస్త్రివిధః
అన్నశ్రాద్ధము
ఆమశ్రాద్ధము
హిరణ్యశ్రాద్ధము
అని శ్రాద్ధములు త్రివిధములు.

2. సూ. మృతాహేష్వన్నలాభేశ్వన్న శ్రాద్ధవేవ.

తద్దినముల యందన్నము దొరికెనా అన్న శ్రాద్ధమే చేయవలయును.

3. సూ. ముఖ్యకల్పానుకల్ప భేదాభోక్తారో ద్వివిధాః
ముఖ్యకల్పభోక్తలు.
అనుకల్పభోక్తలు.

అని భోక్తలు రెండువిధములవారు.

4 సూ. బ్రాహ్మణాలాభత్వనుకల్ప భోక్తారో మాతులాదయో బాంధవాః

బ్రాహ్మణులు ముఖ్యకల్పభోక్తలు - బ్రాహ్మణులు దొరకనప్పుడు మేనమామ మొదలగు బంధువులనుకల్పభోక్తలు.

5. సూ. క్షత్రియవైశ్యయోర్ముఖ్యకల్పభోక్తృలాభో నదృశ్యతే తస్మాదనుకల్ప భోక్తారఏవ.

క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణ భోక్తలు లభించుట గానరాదు. కావున అనుకల్ప భోక్తలకే శ్రాద్ధము జరిగించవలసినది.

6. సూ. క్షత్రియవైశ్యయో రాపదివినా బ్రాహ్మణ ఏవ యాజకః

ఆపత్తునందుతప్ప, తక్కిన అన్ని సమయములందునా క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణుడే యాజకుడుగా నుండును.

7. సూ. క్షత్రియవైశ్య ఛోత్రృణాం దక్షిణాది ప్రతిగ్రహదూష్యః

క్షత్రియ వైశ్యఛోత్రలు దక్షిణాదులు పుచ్చుకొ దూష్యముకాదు.

8. సూ. క్షత్రియవైశ్యేషు మాస సంవత్సరాది శ్రాద్ధ ఆమశ్రాద్ధదురాచారః పరిత్యజనీయః

తద్దినము. మాసికము మొదలగు శ్రాద్ధము క్షత్రి వైశ్యులు ఆమముచేత జరిగించుచు వచ్చు దురాచారము వదిలివైవదగినది.

శ్లో॥ శ్రాద్ధసంశయవిచ్ఛేది సర్వార్థస్యైవ సంగ్రహః।
ఉపన్యాసోపసంహారే - కృతశ్శ్రీరామశర్మణా ॥

"శ్రాద్ధ సంశయ విచ్ఛేది" యను ఉపన్యాసము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ



**BHRUNGARAJA MAHIMA**

by Rs. 6/-

Mahakavi Dasu Sriramulu

---

## మహాకవి దాసు శ్రీరామలు గారిచే రచింపబడిన మా యితర ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ దేవీ భాగవతము | 60-00 |
| 2. | తెలుగునాడు | 5-00 |
| 3. | అభినవగద్య ప్రబంధము | 6-00 |
| 4. | సూర్యశతకము | 6-00 |
| 5. | కురంగగౌరీ శంకర నాటిక | 8-00 |
| 6. | భృంగరాజమహిమ<br>శ్రాద్ధసంశయవిచ్ఛేదిని | 6-00 |
| 7. | ఆచార నిరుక్తి<br>విగ్రహారాధన తారావళి<br>దురాచార పిశాచ భంజని | 6-00 |
| | చక్కట్ల దండ | 7-00 |
| 9. | అక్షరావిలాసము | 7-00 |

---

**Makavi Dasu Sreeramulu Smaraka Samithi**

Vani Sadan, 3-4-885/A, Barkatpura

HYDERABAD - 500 027